# సావిత్రి

-ఎస్. లక్ష్మణయ్యనాయుడు






తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

శ్రీనివాసబాలభారతి—2

# సావిత్రి

రచన :

శ్రీ సముద్రాల లక్ష్మణయ్య

ప్రధానసంపాదకుడు :

డాక్టర్ ఎస్. బి. రఘునాథాచార్య




ప్రచురణ :

శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ. ఏ. ఎస్.

కార్యనిర్వహణాధికారి,

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

1 9 8 0

T.T.D. Religious Publications Series No. 53

# SRNIVĀSA BĀLABHĀRATI – 2
(Children Series)



## SĀVITRI

by

Sri S. Lakshmanaiah

Chief - Editor :

Dr. S. B. Raghunadhacharya

Krishna Pushkaram
Roudri, 1980
Copies 10,000.



*Published by:*
Sri P. V. R. K. Prasad, I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.




ART : SEELA VIRRAJU

Subsidised Price : 0—50

*Printed at :*
Tirumala Tirupati Devasthanams Press, Tirupati.

# స్వాగతం !!

శ్రీనివాసదయోద్భూతా బాలానాం స్ఫూర్తిదాయిని ।
భారతీ జయతాల్లోకే భారతీయగుణోజ్జ్వలా ॥

ఖండ ఖండాంతరాల్లో నాగరికత కన్నువిప్పనాటికే సభ్యతకు సంస్కారానికి, నైతిక-ధార్మికాదర్శాలకు పేరుపడ్డది మన భారతఖండం. ఈ గడ్డపై పుట్టిన ప్రతిమానవుడు అధర్మాన్ని ఎదిరిస్తూ, ధర్మాచరణంలో తన జీవితాన్ని పండించుకొని, మోక్షాభిముఖంగా నడచి మహనీయకీర్తి నార్జించినవాడే. అలాంటి మహాత్ముల సన్నిధి మన సుఖ సంతోషాలకు పెన్నిధి. కనీసం వారి జీవితాదర్శాలు మనస్సుల్లో మెదిలితే వాటిప్రభావం మనమీద ఎంతో ఉంటుంది. 'నేను భారతీయుణ్ణి' ఇది తర తరాల నుంచి వస్తున్న నా సంప్రదాయం', 'ఇది నాకర్తవ్యం' అని ప్రతి బాలుడు, బాలిక, ఈదేశ సేవకు తనను అంకితం చేసుకుంటారు.

నిజానికి ఈదేశంలో ఎందరో మహానుభావులు, మహాపురుషులు, మహాపతివ్రతలు, మహావీరులు పుట్టి, పెరిగి, చక్కని సంస్కృతికి పునాదులు వేశారు. స్వచ్ఛమైన జీవనవాహినిని మనదాకా ప్రవహింపచేశారు. ఆహా! మనమెంత అదృష్టవంతులం! మన వెనుక ఎంత ఉదాత్తమైన చరిత్ర ఉంది! ఆ పుణ్యపురుషులు, మహాసాధ్వులు, ఇక్కడ పుట్టకపోతే మనదిగా మనం చెప్పుకొనే మహత్తరమైన ఈ సంస్కృతి, సభ్యత మనకెలా సంక్రమించేవి? వాళ్లను అర్థం చేసుకోవడం, వాళ్ల చరిత్ర మననం చేసుకోవడం, వారి ఆదర్శాలు స్మరించడం కూడ మనకు గొప్ప విజ్ఞానాన్నందించే విద్యాభ్యాసం. అది ముందు ముందు మనజాతి జీవనప్రవాహంలో కొన్ని ఏండ్లదాకా చెక్కుచెదరని స్ఫూర్తిసౌరభాలను వెదజిమ్ముతుంది. అందుకే శ్రీనివాసబాలభారతి ఉదయించింది. ఎందరో మహానుభావుల్ని మీముందుంచుతోంది. ఇక మీదే ఆలస్యం. బాలలూ! రండి! రండి!

నిండుమనస్సుతో మీకిదే మాస్వాగతం!

వ్యాసపూర్ణిమ — ఎస్. బి. రఘునాథాచార్య

27-7-1980 — ప్రధానసంపాదకుడు

యముని చేతుల్లో పడ్డ ప్రాణాలు తిరిగి వస్తాయా? మృత్యు ముఖంలో ప్రవేశించిన జీవి మళ్లా బ్రతుకుతుందా? ఎలా బ్రతుకుతుంది? ఇవన్నీ అసంభవమైన విషయాలు. కాదు కాదు. వినయ విధేయతలతో, పాతివ్రత్యంతో, యమధర్మరాజును మెప్పించి భర్త ప్రాణాలను తిరిగి సంపాదించిన ఒక రాకుమార్తె మనచరిత్రలో ప్రముఖ స్థానాన్నాక్రమించింది. మహాపతివ్రతగా కీర్తింపబడింది. ఒక సంవత్సరం కంటె అతడు బ్రతకడని తెలిసి కూడా వివాహం చేసుకొని, సిరిసంపదల్లో పుట్టిందైనా భర్తతో ఆశ్రమంలో సామాన్య జీవనం గడపింది. అటు అత్తమామల ఆదరాన్ని, ఇటు తల్లి దండ్రుల అభిమానాన్ని సమానంగా పొందగల్గిన ఆ యువతి ఎవరో తెలుసా? సత్యవంతుని భార్య సావిత్రి.

- ప్రధానసంపాదకుడు

# సావిత్రి

"జాతస్య మరణం ధ్రువం" అని భగవంతుని మాట. పుట్టినవాడు ఎలాగూ చావక తప్పదు. వయసు చెల్లిన వాళ్ళు మరణిస్తే అంతగా దుఃఖించవలసిన పని లేదు. కాని పిల్లలూ, యువకులూ అకాలమరణానికి గురైతే ఎంతగానో దుఃఖిస్తాం. అయినా మనం చేయగలిగింది ఏమీ లేదు.

### అశ్వపతి సంతాపం :

ప్రాచీనకాలంలో మద్రదేశం సకల సంపదలతో తులదూగుతూ వుండేది. అశ్వపతి అనే రాజు ఆదేశాన్ని పరిపాలించే వాడు. ఆయనకు అన్నివిధాలా తగిన యిల్లాలు మాళవి. ఆయన ప్రజలను కన్నబిడ్డల్లాగా చూచుకొనేవాడు. ప్రజలు కూడ ఆయన్ను కన్నతండ్రిలాగా ప్రేమించేవారు.

అశ్వపతికి భోగభాగ్యాలలో ఏకొఱతా లేదు. అయినా సంతానం లేకపోవడం వల్ల ఆయనకు సంతోషం కరువైంది. ఆయన తనలో తాను ఇలా చింతించేవాడు —"నాతర్వాత ఈ రాజ్యాన్ని ఎవరు పాలిస్తారు? రాజు లేకపోతే ప్రజలకు రక్షణ వుండదు. అరాజకమైన దేశం దుష్టుల పాలవుతుంది. అప్పుడు ప్రజలు కష్టాల పాలవుతారు. ఇందుకు నేను ఏంచేయాలి." ఇలా చింతిస్తూ ఆయన ఎలాగయినా సంతానం పొంది తీరాలని అనుకొన్నాడు.

### నీకు కూతురే పుడుతుంది :

సంతాన కాంక్షతో ధర్మపత్నీ సమేతంగా అశ్వపతి సావిత్రీదేవిని ఉపాసించాడు. ఉపాసన పద్దెనిమిది సంవత్సరాలు నిర్విఘ్నంగా కొనసాగింది. చివరికి దేవి ప్రత్యక్షమై వరం కోరుకొమ్మన్నది.

రాజు జగన్మాతకు సాష్టాంగనమస్కారం చేసి '' దేవీ! పుత్రుణ్ణి ప్రసాదించు '' అని ప్రార్థించాడు. ''రాజా! నీకు పుత్రిక కలుగుతుంది'' అని దేవి చెప్పింది. తన కోరిక పుత్రుడి మీదనే ఉన్నదని రాజు మళ్ళీ విన్నవించుకొన్నాడు.

అప్పుడు దేవి ''రాజా! నీవు కుమారుణ్ణి కోరి నన్ను సేవించావని నాకు తెలుసు. బ్రహ్మదేవుడితో ఈ విషయం ప్రస్తావించాను. ఆ దేవుడు నీకు పుత్రికనే అనుగ్రహించాడు. నీకు కలుగబోయే కుమార్తె మహాపవిత్ర చరిత్ర. ఆమె సౌశీల. ప్రభావం వల్ల తర్వాత నీకు కొడుకులు గూడ పుట్టారు'' అని చెప్పి అంతర్ధాన మయింది

## సావిత్రి పుట్టింది :

తర్వాత కొంత కాలానికి మాళవి గర్భం ధరించి శుభలగ్నంలో పుత్రికను ప్రసవించింది. సావిత్రీదేవి వరప్రసాదం కాబట్టి రాజు బిడ్డకు 'సావిత్రి' అని నామకరణం చేశాడు. రాజదంపతులు గారాబంతో అమ్మాయిని పెంచుతున్నారు. శుక్లపక్షంలో చంద్రకళలాగా సావిత్రి దినదినాభివృద్ధి పొందింది. చదువులోనూ, సౌందర్యంలోనూ, సౌశీల్యంలోనూ ఆమె సాటిలేని మేటి అనిపించుకొన్నది.

## సత్యవంతునిపై వలపు :

క్రమంగా సావిత్రికి పెండ్లి వయసు వచ్చింది. అశ్వపతి కుమార్తెకు అన్ని విధాలా తగిన వరుణ్ణి అన్వేషించే ప్రయత్నం ప్రారంభించాడు.

సాళ్వదేశానికి రాజు ద్యుమత్సేనుడు. ఆయనకొడుకు సత్యవంతుడు. అతడు అందంలో మన్మథుణ్ణి మించినవాడు. గుణవంతులలో అతనితో సమానుడు మరొకడు లేడు ఆరాజపుత్రుణ్ణి గూర్చి కర్ణాకర్ణికగా విని సావిత్రి అతనిపై వలపు పెంచు కొన్నది. అయినా సిగ్గువల్ల ఆమె ఎవరితోనూ తన అభిప్రాయం వెల్లడి చేసింది కాదు. ఇలా కొన్ని రోజులు గడచిపోయాయి.

## నీకు నచ్చినవాణ్ణి కోరుకో ! :

ఒకరోజు త్రిలోకసంచారి నారదమహర్షి అశ్వపతి చెంతకు వచ్చాడు. రాజు మునీంద్రుణ్ణి యథావిధిగా పూజించాడు. ఇంతలో శృంగారాధిదేవతలా వున్న సావిత్రి చెలికత్తెలతో విలాసంగా విహరిస్తూ అక్కడికి వచ్చి తండ్రికీ, మునీంద్రుడికీ నమస్కరించింది.

నారదుడు ఆమెను చూచి "రాజా! పెళ్ళియీడు వచ్చిన ఈ కన్యకను తగిన వరుడికిచ్చి వివాహం చేయకుండా ఇలా ఎందుకుంచావు ?" అని ప్రశ్నించాడు. "మునీంద్రా! ఆ ప్రయత్నంలోనే వున్నాను" అని రాజు సమాధానం చెప్పాడు. తర్వాత కుమార్తెను చూచి "అమ్మా ! అదేపనిగా అంతటా వెదుకుతున్నాను. కాని నీకు తగినవాడు కనిపించలేదు. నీకు నచ్చినవాణ్ణి నీవే కోరుకో. సంతోషంగా వివాహం జరిపిస్తాను" అని చెప్పాడు.

సావిత్రి సిగ్గుతో తల వంచుకొన్నది. అయినా తనకోరిక ప్రకటించటానికి తగిన సమయం అదే కాబట్టి సిగ్గును కాస్తా ప్రక్కకునెట్టి సత్యవంతుణ్ణి తాను ప్రేమించిన విషయం మెల్లగా తెలియపరిచి ఇలా అన్నది— "నాన్నా! ద్యుమత్సేన మహారాజు దైవయోగంవల్ల కన్నులు పోగొట్టుకున్నాడనీ, రాజ్యంకూడా శత్రువుల వశమైందనీ, భార్యాపుత్రులతో గూడి ఆయన ఇప్పుడు అడవులలో నివసిస్తున్నాడని నాకు తెలిసింది. అయినా ఆయన కుమారుణ్ణే నేను మనసారా ప్రేమిస్తున్నాను."

అశ్వపతి నారదుణ్ణి చూచి "మునీంద్రా! మూడు లోకాలలోనూ మీకు తెలియని సంగతి లేదు. సత్యవంతుని గుణం, రూపం, శీలం మొదలైన విశేషాలను దయచేసి వివరించండి !" అని ప్రార్థించాడు

నారదుడు ఇలా చెప్పాడు — "రాజా ! మీ అమ్మాయి కోరుకొన్న రాజ కుమారుడు ఎప్పుడూ సత్యమే పలుకుతాడు కాబట్టి 'సత్యవంతుడు' అని పేరు పొందాడు. అతణ్ణి 'చిత్రాశ్వుడు' అని కూడ అంటారు. అతడు మహాతేజస్వి

మహాబుద్ధిమంతుడు, మహాశూరుడు. సౌందర్యంలో కానీ, సౌజన్యంలో కానీ అతణ్ణి మించిన వాడు మరొకడు లేడు.

ఒక సంవత్సరంకంటే బ్రతకడు :

అయినా కీడెంచి మేలెంచమని పెద్దలంటారు. అందువల్ల సత్యవంతునిలో వున్న లోపం కూడ తెలియజేస్తాను. "ఈ దినం మొదలు సరిగా ఒక సంవత్సరకాలానికి అతడు మరణిస్తాడు. ఈ సంగతి తెలిసికూడ నీకు చెప్పకపోవడం మంచిది కాదని చెబుతున్నాను."

అప్పుడు రాజు కుమార్తెతో "తల్లీ! మునీంద్రుడి మాట విన్నావు కదా! ఈ మహానుభావుడికి తెలియని దేవరహస్యాలు ఏవీ లేవు. ఈయనమాట తిరుగులేనిది. సంవత్సరకాలానికి మృత్యువువాతపడే భర్త నీకెందుకమ్మా! నామాటవిని మరొక వరుణ్ణి ఎన్నుకో" అని అన్నాడు.

అప్పుడు సావిత్రి "నాన్నా! నా మనస్సు సత్యవంతుడి మీద దృఢంగా లగ్నమై వుంది. ఒకరిపై వున్న ప్రేమను మరొకరిపైకి మళ్లించడం కులకన్యలకు ఎంత మాత్రం తగదు. ఏది ఏమైనా సరే నా మనోనిశ్చయం మారదు. నేను త్రికరణ శుద్ధిగా సత్యవంతుణ్ణే వరించాను. ఏ పరిస్థితిలోనూ మరొకరిని వరించలేను" అని నిక్కచ్చిగా చెప్పింది. ఆమాటలు విని రాజు విభ్రాంతి చెందాడు.

సావిత్రి మనోనిశ్చయానికి నారదుడు ఆశ్చర్యపడ్డాడు. ఆమె సౌశీల్యానికి మెచ్చుకొన్నాడు. కుమార్తె నిర్ణయం పట్ల ఏమిచేయాలో తోచక మౌనంగా తన్ను చూస్తూవున్న రాజుతో ఆయన ఇలా అన్నాడు— "నరేంద్రా! నీకూతురు మహా గుణవతి. పవిత్రమైన ఈమె నిశ్చయాన్ని మార్చటం మనవల్ల కాదు. ఈమె కోరిక మన్నించి సత్యవంతుడితో వివాహము జరిపించు. ఈమె చేసిన పుణ్యంవల్ల చివరికి మేలే జరుగుతుంది"

రాజు మునీంద్రుడి మాటలకు సమ్మతించి ఆయనకు నమస్కరించాడు. నారదుడు తండ్రినీ, కుమార్తెనూ దీవించి దేవలోకానికి తిరిగి వెళ్లాడు

ఆశ్రమానికి ప్రయాణం :

అశ్వపతి ఒక మంచి రోజున సావిత్రిని వెంటబెట్టుకొని ద్యుమత్సేనమహా రాజుదగ్గఱికి బయలుదేరాడు. బంధువులూ, మంత్రులూ, పురోహితులూ రాజువెంబడి పయనమయ్యారు. పెండ్లికి కావలసిన వస్తువులన్నీ తీసుకొని అరణ్యమార్గం ద్వారా చివరికి వాళ్లందరూ ద్యుమత్సేనుడు నివసించే ఆశ్రమం చేరుకొన్నారు.

అంధుడై రాజ్యం పోగొట్టుకొని అడవిలో నివసిస్తున్న ద్యుమత్సేనుడికి తన్ను వెదుక్కుంటూ మద్రదేశపు రాజు రావడం ఆశ్చర్యం కలిగించింది. అశ్వపతి రాకకు సంబరపడి ఆయన ఉచిత మర్యాదలు చేసి కుశలం అడిగాడు. అంతదూరం శ్రమ పడి రావడానికి కారణమేమని ఆప్యాయతతో ప్రశ్నించాడు.

అశ్వపతి సావిత్రిచేత ద్యుమత్సేనుడికి అభివందనం చేయించి ఇలా అన్నాడు— "రాజేంద్రా! ఈ కన్యక నాకు ఏకైక పుత్రిక. మావంశాన్ని ఉద్ధరించటానికి ఈమె తప్ప మాకు వేరే దిక్కులేదు. చిరకాలానికి జగన్మాత అనుగ్రహం వల్ల ఈమె మాకు కలిగింది. గుణవంతురాలైన ఈముద్దుల బిడ్డను నీ కొడుకు సత్యవంతుడికిచ్చి నీతో వియ్యమందటానికి నిశ్చయించుకొని వచ్చాను. ఈమెను కోడలుగా పరిగ్రహించి నన్ను ధన్యుణ్ణి గావించు."

ఆమాటలు విని ద్యుమత్సేనుడు "అయ్యా! మీ ఆశయం మంచిదే. మీతో వియ్యమందడం కంటే మాకు మాత్రం కావలసిందేమున్నది? అయినా మేమిప్పుడు రాజ్యం పోగొట్టుకొని అడవుల పాలయ్యాము. ఈ ఆశ్రమంలో మునివృత్తితో తపస్సు చేసుకొంటున్నాము. అల్లారుముద్దుగా మీరు పెంచుకొన్న ఈ సుకుమారి మాతో గూడా ఈ అడవులలో ఎలా వుంటుంది? ఇక్కడి కష్టాలకెలా ఓర్చుకొంటుంది?" అని అన్నాడు.

అందుకు అశ్వపతి ఇలా బదులు చెప్పాడు— "రాజా! కలిమిలేములు కావడికుండలు. సంపదలు పొందడం ఆపదలు క్రుంగడం దిగులు ఎంతమాత్రం

తగదు. నా కుమార్తె మహాధీరురాలు. ఈమె సుఖదుఃఖాలను లెక్కపెట్టదు. మీ బాంధవ్యం మీద ఎంతో ఆశపెట్టుకొని ఇంతదూరం వచ్చాను. నా కోరిక తిరస్కరించకండి!"

### కోరుకున్న భర్త దొరికాడు :

ఆ మాటకు ద్యుమత్సేనుడు సంతసించి వివాహానికంగీకరించాడు. ఇరుగు పొరుగున వుండే ఆశ్రమవాసులందరూ పెండ్లికి వచ్చారు. శుభలగ్నంలో సావిత్రీ సత్యవంతుల వివాహం పెద్దవేడుకగా జరిగింది. వచ్చిన పెద్దలందరూ వధూవరులను నిండుమనసుతో ఆశీర్వదించారు. అశ్వపతి కూతురికీ అల్లుడికీ వస్త్రాలూ, ఆభరణాలూ, విలువైన వస్తువులూ విశేషంగా ఇచ్చాడు. తరువాత పరివారంతో సహా తనరాజ్యానికి పయనమై పోయాడు.

సావిత్రి కోరుకొన్నపతి లభించినందుకు ఎంతో సంతోషించింది. సత్యవంతుడు తగిన సతీమణిని చేపట్టగల్గినందుకు ఆనందించాడు. దాంపత్యం అనుకూలంగావుంటే సంసారానికి మించిన సౌఖ్యం ఏమున్నది? చిలకా గోరువంకలలాగా అన్యోన్యానురాగంతో కలసిమెలిసి వున్న ఆ నవదంపతులను చూచి ఆశ్రమవాసులందరూ మెచ్చుకొన్నారు.

సావిత్రి విలువైన వస్త్రాలూ, ఆభరణాలూ వదలిపెట్టి అరణ్యవాసానికి తగ్గట్టు నారచీరలు ధరించింది. ఆ సహజసుందరికి అవి కూడా అపూర్వమైన అందాన్నే చేకూర్చాయి. మృదువైన ఆమె మాటలూ, భక్తితో ఆమె చేసే సేవలూ అత్తమామలను అలరించాయి. పతిసేవలో ఆమె ప్రాచీనకాలపు మహాపతివ్రతలను మించిపోయింది. మునిపత్నులు ఆమె వద్ద తాము నేర్చుకోవలసిన సుగుణాలు ఎన్నో వున్నాయని భావించేవారు.

## సమీపిస్తున్న గడువు :

రోజులు సుఖప్రదంగా సాగిపోతున్నాయి. కాని నారదమహర్షి మాటలు సావిత్రి మనస్సులో ఒకవంక తీరని వేదన కలిగిస్తూనే వున్నాయి. నివురు గప్పిన నిప్పులా ఆమె తనలో తాను కుములుతూనే పైకి సంతోషంగా వున్నట్లు కనిపించేది.

నారదుడు చెప్పిన నాటినుండీ ఆమె తన భర్త ఆయుఃప్రమాణం లెక్కవేసు కొంటూ వచ్చింది. గడువు సమీపించే కొద్దీ ఆమెలో దిగులు ఎక్కువయింది. అయినా ఆమె ఎంతో నిబ్బరంతో వున్నట్లు కనిపించింది.

## మూడు రోజుల ఉపవాసవ్రతం :

ఆ తుది రోజులు రానే వచ్చాయి. ఇక నాల్గుదినాలలో సత్యవంతుడు మర ణించనున్నాడు. సావిత్రి తీవ్రభక్తితో భగవంతుణ్ణి ధ్యానించింది. నిష్ఠతో మూడు దినాల ఉపవాసవ్రతం చేపట్టింది. కోడలు ఉపవాస ముంటున్నదని తెలిసి అత్త మామలు "అమ్మా! ఎందుకింత కఠినమైన వ్రతం చేస్తున్నావు?" అని అను నయంతో ఆమెను ప్రశ్నించారు.

ఆమె వినయంగా ఇలా అన్నది – "మీరు నావ్రతం విషయమై విచారించ కండి! ఒకమేలు కోరి నేనీవ్రతం చేస్తున్నాను. ఎందుకు చేస్తున్నానో తర్వాత మీకే తెలుస్తుంది." ఈ మాటవిని పెద్దలిద్దరూ ఏమీ అనలేక ఊరకుండిపోయారు.

మూడు రోజులూ గడచిపోయాయి. దారుణమైన ఆ చివరిదినం రానే వచ్చింది. ఆ రోజు సావిత్రి బ్రహ్మముహూర్తానికి ముందే మేల్కొన్నది. జరగ బోయే విపత్తు ఆమె కళ్లముందు కదలింది. కట్టలు తెంచుకొంటున్న దుఃఖాన్ని దిగమ్రింగుకొని ఆమె దినకృత్యాలు నెరవేర్చింది. భర్తకూ, అత్తమామలకూ పరి చర్యలు చేసింది. పెద్దలందరకూ నమస్కరించి వాళ్ల దీవనలు గ్రహించింది.

అప్పటికి జాము ప్రొద్దెక్కింది. "మూడుదినాలూ గడచిపోయాయి. ఇక వారణ పూరిచేయు" మని ద్యుమత్సేనుడు సావిత్రితో చెప్పాడు. ఆదినం కూడా

సూర్యుడు అస్తమించేవరకూ భోజనం చేయకూడదన్న తన నిశ్చయాన్ని ఆమె ఆయనకు తెలియజేసింది.

ఇంతలో సత్యవంతుడు సమిధలూ, దర్భలూ, పండ్లూ తేవటానికి అడవికి ప్రయాణమైనాడు. సావిత్రి "నేనూ మీతో కూడా అడవికి వస్తాను. తీసుకు పోండి!" అని భర్తను ప్రార్థించింది.

"నీవు మూడు దినాలనుండి ఉపవాసం చేసి చాలా నీరసంగా వున్నావు. నాతో రాలేవు. అడవిలో నడవడం చాలాకష్టం," అని సత్యవంతు డన్నాడు. అందుకు ఆమె "నాథా! ఉపవాసం వల్ల నాకు ఏ విధమైన శ్రమా లేదు. మీతో నడుస్తుంటే ఎక్కడైనా నాకు కష్టమనిపించదు. అడవిలో ఎన్నోరకాల పూలూ, పండ్లూ, తీగలూ, మృగాలూ, పక్షులూ వుంటాయని విన్నాను. ఆ వింతలన్నీ కళ్లారా చూడాలని ఎన్నో దినాలనుంచీ అనుకొంటున్నాను. ఈ దినం ఎలాగైనా మీతో రావాలని నిశ్చయించుకొన్నాను. తప్పక నా కోరిక తీర్చండి!" అని బ్రతిమాలుకొన్నది.

సత్యవంతుడు ఆమె కోరికకు సమ్మతించాడు. సావిత్రి అత్తమామలకు నమస్కరించి భర్తతో అడవికి వెళ్లటానికి అనుమతించమని ప్రార్థించింది. కోడలు ప్రియంగా అడిగిన ఆ ఒక్కకోర్కెను కాదనలేక వాళ్లూ అందుకు అంగీకరించారు.

**అడవికి ప్రయాణం:**

దంపతులిద్దరూ అడవికి బయలుదేరారు. మనసులోని తాపాన్ని బలవంతంగా అణచుకొని ముఖంపై చిరునవ్వులొలికిస్తూ సావిత్రి భర్త అడుగుజాడలో నడిచింది. మెల్లగా నడుస్తూ వాళ్లు పరిసరంలో వున్న అరణ్యం చేరుకొన్నారు.

సత్యవంతుడు అందమైన అక్కడి దృశ్యాలను భార్యకు చూపుతూ ఇలా అన్నాడు — "సావిత్రీ! ఆ మడుగులో అలలపై విలాసంగా విహరిస్తున్న రాజ హంసలెంత అందంగా వున్నాయో చూడు. ఈ చెట్లుపూలూ ఆ తీగలిగుబాలు

ఎంత ముచ్చటగా వున్నాయి ! మనం నాటి పెంచిన చెట్లూ, తీగలూ ఇంత మనోహ రంగా వుంటాయా ? ఈ తీగ ఆ చెట్టును ఎలా పెనవేసుకొన్నదో చూచావా ? పూదేనెలు ఆస్వాదిస్తూ ఝుమ్మంటున్న తుమ్మెదలూ, పండ్లు రుచిచూస్తూ కిల కిల మంటున్న చిలుకలూ కళ్ళకింపు గొల్పుతూ వీనులకు విందు చేస్తున్నాయి.''

సావిత్రి అతనితో ఉచితమైన మారు మాటలు పలుకుతూ అతని వాలకం గమనిస్తూ వెంట నడిచింది.

అక్కడ సత్యవంతుడు రకరకాలైన తియ్యని పండ్లుకోసి బుట్ట నింపాడు. తర్వాత గొడ్డలితో కట్టెలు చీలుస్తూ అలసిపోయినట్లు కనిపించాడు. క్రమంగా అతడి బడలిక తీవ్రమయింది. ఇక ఎంతమాత్రం నిలవలేక వశం తప్పి గొడ్డలి నేలపై వదిలేశాడు. ముఖవికాసం కోల్పోయి భారంగా నిట్టూర్పులు విడుస్తూ విషాదంతో అర్ధాంగిని చూచి ఇలా అన్నాడు —

"సావిత్రీ! నాకేమో ఒంట్లో బాగాలేదు. తలగిర్రున తిరుగుతున్నది. మనసు స్వాధీనం తప్పుతున్నది. ఎవరో శూలంతో పొడిచినట్లున్నది. ఇక నిల బడలేను. కొంతసేపు ఇక్కడ పడుకొంటాను.''

వెంటనే సావిత్రి భర్త శిరస్సుకు తన వొడిని దిండుగా చేసింది. రాజపుత్రుడు ఆమెపై తల వ్రాలుస్తూ సోలి పడిపోయాడు. క్షణంలో అతడి శరీరం చైతన్యం కోల్పోయి నట్లయింది.

## యమ సందర్శనం :

ఆ మరుక్షణంలో సావిత్రి ఎదురుగా ఒక దివ్యపురుషుణ్ణి చూచింది. అతని శరీరం కాటుకలా నల్లగా వున్నది. పండ్లు వాడిగానూ, భీకరంగానూ వున్నాయి. కళ్లు చింతనిప్పులులా ఎర్రగా వున్నాయి. అతడి వైపు చూడటానికే భయంవేస్తున్నది.

ఆ పురుషుడు వడి వడిగా సత్యవంతుణ్ణి సమీపించాడు. సావిత్రి భర్త తల నేలపై వుంచి భయంతో లేచి నిలబడింది. ఆ దివ్యపురుషుడికి నమస్కరించి "అయ్యా! మీరెవరు? ఏమి చెయ్యాలని ఇక్కడికి వచ్చారు?" అని వినయంతో ప్రశ్నించింది.

అతడు ఆమె తన్ను చూడగలిగినందుకు ఆశ్చర్యపడి ఇలా అన్నాడు —

"అమ్మా! నేను యమధర్మరాజును. జీవుల కర్మగతిని బట్టి ప్రాణాలు హరించేవాణ్ణి నేనే. వాళ్లను నాలోకానికి తీసుకుపోయి వాళ్ల వాళ్ల పాపకర్మలకు తగిన శిక్షలు విధిస్తూ వుంటాను. సాధారణంగా నేనెవరికీ కనిపించను. పాతివ్రత్యమహిమ వల్లనే నీవు నన్ను చూడగలిగావు.

నీ భర్తకు అంత్యకాలం సమీపించింది ఇతడు మహాపుణ్యాత్ముడు. ఎన్నో ధర్మకార్యాలు చేసిన వాడు. అందువల్ల ఇతని ప్రాణాలు హరించటానికి భటులను పంపక నేనే స్వయంగా వచ్చాను."

అలా చెప్పి యముడు వెనువెంటనే సత్యవంతుని దేహంనుండి జీవుణ్ణి వేఱుచేసి భయంకరమైన పాశంతో బంధించి పట్టుకొని దక్షిణదిశగా పయనించాడు.

సావిత్రికి శోకం పెల్లుబికింది. అయినా అలాంటి పరిస్థితుల్లో దుఃఖిస్తూ కూర్చుంటే ప్రయోజన మేమిటి? వెంటనే ఆమె ధైర్యం తెచ్చుకొని కర్తవ్యం నిర్ణయించుకొన్నది. భర్త శరీరాన్ని ఒకచోట సురక్షితంగా వుంచింది. తొట్రుపాటుతో పాదాలు వణకుతున్నా లెక్కచేయకుండా యముణ్ణి అనుసరించి నడిచింది.

వెంటవస్తున్న సావిత్రిని చూచి యమధర్మరాజు "అమ్మా! ఎందుకిలా వస్తున్నావు. ఈదారిలో నడవటం చాలాకష్టం. తిరిగి వెళ్లు" అని మృదువుగా చెప్పాడు.

అందుకు సావిత్రి ఇలా అన్నది – "ధర్మరాజా! పతులుపోయే చోటికి సతులుపోవడం ధర్మం. పతినే గతిగా భావించిన నేను పతిని విడచి ఎలా వుండగలను? మీ అనుగ్రహముతో నేనెక్కడికైనా రాగలను

లోకంలో అన్నింటికన్నా ధర్మం ప్రధానమంటారు. అలాంటి ధర్మాన్ని రక్షించేవారు మీ వంటి సజ్జనులే. మీబోటి మహానుభావుల దర్శనం వ్యర్థంకాదు. మిమ్మల్ని సందర్శించి మీ అనుగ్రహం పొందకుండా నేను ఊరక తిరిగిపోతానా?"

ఆ మాటలకు యముడు సంతోషించి యిలా అన్నాడు —

### మొదటివరం - మామగారికి దృష్టి :

"అమ్మా! నీవు చాలా తెలివైనదానివి. నీ మాటలు నాకెంతో ముచ్చటగా వున్నాయి. నీభర్త ప్రాణాలు తప్ప ఇంకేదైనా ఒక వరం కోరుకో! ఇస్తాను"

సావిత్రి ఆయనకు నమస్కరించి "దేవా! మీరెంతో దయామూర్తులు. మిమ్మల్ని ఎలా స్తుతించాలో నాకు తెలియడం లేదు. అంధుడై రాజ్యం పోగొట్టుకొని అరణ్యంలో వున్న మా మామ ద్యుమత్సేన మహారాజుకు కన్నులు వచ్చేటట్లు అనుగ్రహించండి!" అని వేడుకొన్నది

యముడు ఆమె కోరిక అనుగ్రహించి "ఇక నీవు నాతో రావద్దు. నా మాటవిని తిరిగిపో" అని చెప్పి చరచరా సాగిపోయాడు. సావిత్రి అంతటితో నిలవక ఆయనవెంట మళ్లీ పయనించింది.

### రెండవ వరం – మామగారికి తిరిగి రాజ్యం :

అలా పయనిస్తూ ఆయనను ఇలా ప్రార్థించింది– "మహానుభావా! ఆర్యులు ఎవ్వరికీ అపకారం తలపెట్టరు. దీనులను దయతో కాపాడుతారు. ఎవ్వరు ఏది కోరినా ఇవ్వటానికి వెనుకాడరు. ఆశ్రయించిన వారిని ఎట్టి పరిస్థితులలోనూ విడనాడరు. ఇవి మీలాంటి పెద్దలు పాటించే ధర్మాలు. మీరు సాక్షాత్తూ ధర్మదేవతలు మీకు తెలియని ధర్మం ఏమున్నది? అందరిపట్లా మీరు సమభావంతో వ్యవహరిస్తారు. అందువల్లనే లోకమంతా మిమ్మల్ని పూజిస్తుంది. జీవుల పాపాలు పోగొట్టే వారు మీరే. మీరయ్య లేకపోతే ఇక మనుషుల్ని కాపాడేదెవరు?"

అప్పుడు యముడు "సావిత్రీ! ఎంతలో దప్పిగొన్న వాడికి చల్లని పానీయం లాగా ఉచితమైన నీ పలుకులు నాకెంతో ఆనందం కలిగిస్తున్నాయి. నీకు మరొక వరం ఇవ్వదలచాను. సత్యవంతుడి ప్రాణాలు తప్ప ఇంక ఏదైనా కోరుకో" అని చెప్పాడు

ఆమె "దేవా! శత్రువుల చేజిక్కిన రాజ్యం మళ్లీ ద్యుమత్సేన మహారాజుకు వశమయ్యేటట్లు కరుణించండి!" అని ప్రార్థించింది. ధర్మదేవత ఆమె రెండవ కోరికను గూడా ప్రసాదించాడు.

తర్వాత యముడు "సావిత్రీ! ఇంక నీవు నిలువు. ఈ దారి చాలా కష్టమైనది. నీ సుకృతం ఫలించింది. భర్తమీదా, అత్తమామలమీదా నీకున్న భక్తి సార్థకమయింది. ఇకమీద నీవు రావటానికి ఏ మాత్రం వీలులేదు. ఇది మానవులు నడిచే దారి కాదు. ఇక్కడి నుండి తిరిగిపో" అని హెచ్చరించి చకచకా కదిలి పోయాడు.

**మూడవ వరం – తండ్రికి పుత్రసంతతి :**

అయినా సావిత్రి తన పట్టు వదలలేదు. ధీరులు అనుకొన్న పని సాధించే దాకా వదలరు కదా! యముణ్ణి అనుసరించి నడుస్తూనే ఆమె ఇలా ఆయనకు విన్నవించింది –

"ధర్మరాజా! ధర్మాత్ములు ఏది ఏమైనా ధర్మకార్యాలు వదలరు. వాళ్ల హృదయాలలో మోహం మొదలైన దుర్గుణాలకు చోటు వుండదు. ధర్మాన్ని రక్షించే వారిని ధర్మమే రక్షిస్తుంది. ధర్మంతప్పి చరించే వాళ్లకు కీడు తప్పదు.

పతిని అనుసరించడమే సతులకు పరమధర్మం. అలాంటి ధర్మం నే నెలా వదలగలను? ఎన్ని కష్టాలు వచ్చినా ధర్మం తప్పడం పాడి గాదని మీకు మాత్రం

ఆ మాటకు యముడు ప్రసన్నుడై " అమ్మా ! నీవు ధర్మం పాటిస్తున్నావు. అందువల్ల నీ మీద నాకెంతో ప్రీతిగావుంది. నీకు మరొకవరం ఇవ్వాలనుకొన్నాను. భర్త జీవితం తప్ప నీకు కావలసిందేమైనా కోరుకో " అని అన్నాడు.

సావిత్రి ఆయనకు చేతులు జోడించి "దేవా ! మీ దయ అపారం. మీ అనుగ్రహానికి పాత్రమై నా జీవితం ధన్యమయింది. మా తండ్రి అశ్వపతికి పుత్ర సంతతి లేదు. ఆయనకు కొడుకులు కలిగేటట్లు వరం ప్రసాదించండి ! అని ప్రార్థించింది.

యమధర్మరాజు ఆమెకు మూడవ వరం కూడా యిచ్చి "సావిత్రీ ! నీవు చాలా దూరం వచ్చావు. ఎంతో అలసిపోయావు. ఇకపై దారి నీవు నడవటానికి వీలుగాదు. ముళ్లూ, రాళ్లతో నిండిన ఈ దారిలో నీవు కాలు పెట్టలేవు. పైగా క్రూర జంతువులూ, తేళ్లూ, పాములూ తిరిగే ప్రాంతమిది. నీ కోరికలన్నీ నెరవేర్చాను గదా ! ఇంకా నన్నెందుకు వెంబడిస్తున్నావు. తిరిగి వెళ్లు " అని చెప్పాడు.

అప్పుడా పతివ్రత ధర్మదేవతతో ఇలా విన్నవించింది – "దేవా ! నా నాథుడిమీద తప్ప నా మనస్సు ఇంక దేనిమీదా లేదు. భక్తితో నా భర్తనే ఎప్పుడూ స్మరిస్తున్నాను. సతులకు పతిని మించిన దైవం లేదు కదా ! నా పతిదేవతను అనుసరించడం కంటే నాకు పరమధర్మం ఏమున్నది ? అలాంటప్పుడు నాకు అలసట ఎలా కలుగుతుంది ?

అంతేకాదు ధర్మాత్ములూ, పుణ్యాత్ములూ అయిన మీబోటి పెద్దల దర్శనం దుర్లభం. మహనీయుల సంసర్గం వల్ల పాపాలన్నీ పటాపంచలవుతాయి. ఈ భూమికి పవిత్రత చేకూర్చేది మీ వంటి మహానుభావులే. వాళ్ల ప్రభావం వల్లనే సూర్య చంద్రులు క్రమం తప్పక ఆకాశంలో సంచరిస్తున్నారు. సముద్రాలు హద్దు మీరక నిల్చివున్నాయి. కుల పర్వతాలు కదలకుండా స్థిరంగా వున్నాయి. మహాత్ముల అను గ్రహం లేకపోతే ప్రపంచంలో శాంతి, సుఖమూ లభించవు

నా పూర్వ పుణ్యంవల్ల ధర్మమూర్తు లయిన మీతో సాంగత్యం కలిగింది. ఎలాంటి వారికైనా ఏడుమాటలతో పెద్దల చెలిమి లభిస్తుందంటారు. మీతో నేను ఎన్నో మాటలు పలికాను. అందువల్ల మన యిద్దరికీ గట్టి మైత్రి కుదిరింది.

మిత్రుల కోరికను పెద్దలెప్పుడూ కాదనరు. ధర్మాత్మా! నా కోరిక మన్నించి నన్ను కృతార్థురాలిని చెయ్యండి!"

## నాల్గవ వరం — భర్త జీవించాలి :

ఈ మాటలు వినగానే యముడి హృదయంలో దయారసం ఉప్పొంగింది. వెంటనే ఆయన "సావిత్రీ! నీ ప్రార్థన నన్ను ప్రసన్నుణ్ణి చేసింది. నీ కిష్టమైన మరొక వరం యిస్తాను. కోరుకో" అని పలికాడు

సంతోషంతో సావిత్రి కన్నులు విప్పారాయి ఆమె యముని పాదాలపై వ్రాలి ఇలా ప్రార్థించింది — "దేవా! ఇంతకుముందు వరాలు ప్రసాదిస్తూ మీరు నన్ను భర్త ప్రాణాలు తప్ప మరేమైనా కోరుకొమ్మనేవారు. ఇప్పుడామాట లేదు. నిజంగా నా సుకృతం ఫలించింది. మీ దయను నేనేమని కొనియాడేది?

భర్త మరణించిన స్త్రీ బ్రతుకు బ్రతుకే కాదు. అలాంటి స్త్రీని ఎవరూ గౌరవించరు. మంగళ కార్యాలలో గూడా ఆమెకు ప్రవేశం లేదు. నా భర్త మహా కీర్తిశాలి, సద్గుణసంపన్నుడు. ఆయన లేకుండా నేను జీవించలేను. ధర్మాత్మా! నా నాథుడు జీవించేటట్లు అనుగ్రహించండి! ఇంతకంటే నాకు కావలసిందేమీ లేదు."

## సత్యవంతుడు తిరిగి బ్రతికాడు :

యమధర్మరాజు ఆమె ప్రార్థన అంగీకరించాడు. సత్యవంతుణ్ణి పాశం నుండి విడిపించి "అమ్మా! నీ కోరిక ప్రకారం నీ భర్తను విడిపిస్తున్నాను. ఇతడు చాలాకాలం లోకంలో జీవిస్తాడు. నూరుమంది కొడుకులను కంటాడు తన కీర్తిని నాలుగు దిక్కులా వ్యాపింపజేస్తాడు. అనేక యజ్ఞాలు చేసి దేవతలకు తృప్తి

కలిగిస్తాడు. ఇతని వంశం చిరస్థాయిగా వర్ధిల్లుతుంది" అని ఆశీర్వదించి అంతర్ధానమై పోయాడు.

సావిత్రి ఆనందంతో భర్త శరీరాన్ని వుంచిన చోటికి వెంటనే తిరిగి వెళ్ళింది. అక్కడ అతని తల తన తొడపై బెట్టుకొని కూర్చున్నది. కొంతసేపటికి సత్యవంతునిలో చైతన్యం కల్గింది.

ఎవడో నన్ను గట్టిగా లాగాడు :

అతడు సావిత్రిని చూచి "సావిత్రీ! నేను చాలాసేపు నిద్రపోయాను. నన్ను నీవెందుకు మేల్కొలపలేదు? ఎవడో బలవంతు డొకడు గట్టిగా నన్ను పట్టి లాగినట్లున్నాడు. అతడు ఎవడో గమనించావా? అది కలగాదు· నిజంగా జరిగినట్లే వుంది. నాకెందుకో చాల భయం వేసింది. అసలు ఏం జరిగిందో చెప్పు" అని అడిగాడు.

అప్పుడు సావిత్రి ఇలా అన్నది — "జరిగిన సంగతి అంతా రేపు చెబుతాను. ఇప్పుడు చీకటి పడింది. ఇంక ఇక్కడ మనం ఆలసించడం మంచిదికాదు అదిగో! రాక్షసులు అప్పుడే ఇటూ అటూ తిరగడం ప్రారంభించారు. నక్కలు అరుస్తున్నాయి. జింకల మందలు తమ నివాసాలకు తిరిగి వెళ్తున్నాయి. త్వరగా ఆశ్రమానికి తిరిగి పోదాం. ఇప్పటికే ఎంతో కాలం మించిపోయింది. మీ తల్లిదండ్రులు మన కోసం ఆదుర్దాతో ఎదురుచూస్తూ వుంటారు. శీఘ్రంగా వెళ్ళి వాళ్ళకు సంతోషం కలిగించాలి. లేకపోతే వాళ్ళు బాధపడతారు"

సావిత్రి ఎంతగా చెప్పినా సత్యవంతుడు పైకి లేవలేకపోయాడు. అతడింకా శోకం నుండి తేరుకోలేదని గుర్తించి ఆమె మళ్ళీ ఇలా చెప్పింది —

"నాథా! చీకటి క్షణక్షణానికి దట్టంగా క్రమ్ముకొంటున్నది. ఇక్కడికి మన ఆశ్రమం చాలా దూరం. మీ కింకా [illegible]

వీలుగాని పక్షంలో ఈ రాత్రికి ఇక్కడే వుండిపోదాం. తెల్లవారగానే బయలుదేరి పోవచ్చు. ఏమి చేయాలో సెలవివ్వండి".

అప్పుడు సత్యవంతు డిలా అన్నాడు — "సావిత్రీ! తల నొప్పి తగ్గిపోయింది. ఇప్పుడిప్పుడే శరీరం శక్తి పుంజుకుంటూ వుంది. మెల్లగా నడుస్తాను. తల్లిదండ్రులను వదిలేసి మనం ఈ అడవిలో ఎలా ఉండగలం? నేనెప్పుడూ వాళ్లను వదలి ఇంతసేపు ఉండలేదు. ఇంతవరకూ మనం వెళ్లనందుకు వాళ్లు ఏమనుకొంటున్నారో? ఎలా ఉన్నారో?

సంధ్యాసమయంలో కూడా మా తల్లి నన్ను ఇల్లు వదలి వెళ్లనిచ్చేది కాదు. ఇప్పుడామె ఎంతగా దిగులుపడి వుందో? అసలే వాళ్లు మూడుకాళ్ల ముసళ్లు. పైగా కళ్లులేని కబోదులై అల్లాడుతున్నారు. ఆశలన్నీ మనమీదే పెట్టుకొని జీవిస్తున్నారు. ఈ పరిస్థితిలో సమయానికి మనం ఇల్లు చేరకపోతే ఎంతగా విలపిస్తున్నారో?

అడవికి రాగానే పళ్లు కోసుకొని మనం అప్పుడే తిరిగిపోయి వుండవలసింది. అనవసరంగా జాగు చేశాం. దైవం మనల్ని పరీక్షించటానికే ఈ చిక్కులు కలిగించినట్లుంది! మా నాన్న చాల కంగారుపడి వుంటాడు. నన్ను గురించి ఆశ్రమంలో వుండేవాళ్ల నందరినీ మాటిమాటికీ అడుగుతూ వుంటాడు. సావిత్రీ! ఇంకా వాళ్లు జీవించే వుంటారా? వాళ్లకేమైనా విపత్తు జరిగేవుంటే మన మిప్పుడు పోయి మాత్రం లాభమేముంది?".

ఇలా అంటూ సత్యవంతుడు కన్నీరుకారుస్తూ శోకించాడు. అప్పుడు సావిత్రికి కూడా దుఃఖం ముంచుకు వచ్చింది. అయినా ఆమె ధైర్యం తెచ్చుకొని భర్తను వోదార్చింది. మెల్లగా తన చేతులతో అతణ్ణి పట్టుకొని పైకి లేపింది.

**ఆశ్రమానికి తిరిగిరాక :**

సత్యవంతుడు వంటి దుమ్ము దులుపుకొని నడవటానికి సిద్ధమయ్యాడు. పండ్లబుట్ట మోయడం కష్టమని సావిత్రి దాన్ని అక్కడే ఒక చెట్టుకు తగిలించింది.

భర్తఎడమ చెయ్యి తన భుజంపై పెట్టుకొని కుడిచేత అత్తణ్ణి పట్టుకొని మెల్లగా నడిపించుకొంటూ ఆశ్రమంవైపు నడచింది.

ఇంతలో ధర్మదేవత ప్రసాదించిన వరప్రభావం వల్ల అక్కడ ద్యుమత్సేనుడికి కళ్ళు కనిపించాయి, ఆయన ఆశ్రమం నలువైపులా చూచాడు. ప్రియమైన కొడుకు కనిపించకపోయేసరికి ఆయనకు అంతా శూన్యంగా తోచింది. అందువల్ల కళ్ళున్నా కళ్ళులేనివానిలా భార్యతో గూడి ఏడవటం మొదలుపెట్టాడు. అక్కడ వున్న మునుల నందరినీ సత్యవంతుణ్ణి చూచారా? అని అడిగాడు. కొడుకు సద్గుణాలు మాటిమాటికీ పేర్కొంటూ విలపించాడు. ధైర్యం కోల్పోయి పెద్దగా శోకించాడు.

ఆయన ఏడుపు విని ఆశ్రమవాసులందరూ చుట్టూ గుమిగూడారు. ఉన్నట్టుండి ఆయన కళ్ళు కనిపించినందుకు అక్కడి వాళ్ళందరూ ఆశ్చర్యపడ్డారు. తగిన మాటలతో ఆ వృద్ధ దంపతులను వోదార్చారు.

తర్వాత కొంతసేపటికి సావిత్రీసత్యవంతులు అక్కడికి చేరుకొన్నారు. వాళ్ళను చూడగానే వృద్ధ దంపతుల కళ్ళ నుండి ఆనందబాష్పాలు రాలాయి. వాళ్ళు కొడుకును కౌగిలించుకొని సంతోషంతో ఉప్పొంగిపోయారు. మునులందరూ వాళ్ళను చూచి ఆనందించారు.

"ఇంతసేపు అడవిలో ఎందుకు ఉన్నారు?" అని ద్యుమత్సేనుడు కొడుకును అడిగాడు.

అప్పుడు సత్యవంతుడు తండ్రితో ఇలా అన్నాడు — "నాన్నా! ఇక్కడ నుండి మేము నేరుగా అడవికి వెళ్ళాం. అక్కడ కావలసినన్ని పళ్ళు కోసుకొన్నాం. తర్వాత కట్టెలు చీలుస్తూవుండగా నాకు తీవ్రమైన తలనొప్పి కలిగింది. వొళ్ళంతా శూలాలతో గ్రుచ్చినట్టు పోటు పుట్టింది. ఆ బాధ భరించలేక అక్కడే పడుకొన్నాను. ఇంతలో ఎవడో ఒక పురుషుడు వచ్చి కలలో నన్ను పట్టి లాక్కుపోయాడు".

యముడనుగ్రహించాడు :

ఆ పైన సావిత్రి మామాతో ఇలా చెప్పింది – "మీ కుమారుడికి ఈ దినం మరణమని ముందొకసారి నారదమహర్షి చెప్పగా నేను విన్నాను. మునీంద్రుడిమాట తప్పదని భావించి నేను ఏమాత్రం ఏమరుపాటు లేకుండా ఈయనతో గూడా అడవికి వెళ్లాను. అక్కడ బడలికతో ఈయన పడుకోగానే యమధర్మరాజు వచ్చాడు. ఈయనశరీరంనుండి జీవుణ్ణి వేఱుచేసి పాశంతో బంధించి అతడు యమలోకానికి బయలుదేరాడు.

నేను వెంట నడుస్తూ పలువిధాల ఆయన మనస్సు కరిగేటట్లు ప్రార్థించాను. దయామూర్తి అయిన ఆ దేవుడు నా స్తుతికి మెచ్చుకొని నాకు నాల్గు వరాలు ప్రసాదించాడు. అందులో ఒక వరం వల్ల మళ్లీ మీ కుమారుడు జీవించగలిగాడు.

తక్కిన మూడు వరాలలో ఒకవరం వల్ల మీకు కళ్లు కనిపించాలనీ, రెండవ వరంవల్ల మీకు రాజ్యం ప్రాప్తించాలనీ, మూడవ వరంవల్ల మా తండ్రికి కొడుకులు కలగాలనీ ప్రార్థించాను. ధర్మదేవత దయతో నా ప్రార్థనలన్నీ అంగీకరించి నన్ను అనుగ్రహించాడు".

కోడలి మాటలువిని వృద్ధ దంపతులు ఆనందసాగరంలో తేలిపోతూ ఆమె నిలా అభినందించారు- "తల్లీ! కష్టాలనే సముద్రంలో మునిగిపోయిన మావంశాన్ని గట్టెక్కించావు. నీ చరిత్ర లోక పూజ్యమమ్మా!"

అక్కడ మునులందరూ జరిగిన సంగతి తెలుసుకొని సావిత్రి గొప్పతనం గుర్తించారు. ఆమెను ప్రశంసిస్తూ ఆశీర్వదించి తమ తమ నివాసాలకు వెళ్లారు

ద్యుమత్సేనునికి రాజ్యప్రాప్తి :

తర్వాత కొద్ది రోజులకు ద్యుమత్సేనుడి మంత్రులూ, సేవకులూ, పౌరులూ ఆశ్రమానికి వచ్చి "రాజా! మీ శత్రువు తన సేవకులలో కలిగిన అంతఃకలహం

ఎల్ల బంధుమిత్రవర్గంతో సహా మరణించాడు. ప్రజలందరూ మళ్లీ మీకే పట్టం కట్టాలని కోరుతున్నారు. రాజ్యమంతటా మీ విజయఘోషలే కనిపిస్తున్నాయి. మీ తపోబలంతో మళ్లీ మీకు కళ్లు కనిపిస్తున్నాయి. ఇప్పుడు మిమ్మల్ని చూడగానే మా కళ్లు చల్లబడ్డాయి. మా కోరిక మన్నించి వెంటనే బయలుదేరి రాజ్యానికి రండి!" అని ప్రార్థించారు.

ద్యుమత్సేన మహారాజు వాళ్లమాటలు విని సంతసించాడు. వెంటనే ఆశ్రమ వాసులందరితో 'వెళ్లి వస్తాను' అని చెప్పి వాళ్ల అనుమతి తీసుకొన్నాడు. కొడుకుతో గూడా భద్రగజాన్ని అధిష్ఠించాడు. సతీసమేతుడై పరివారంతో సహా బయలుదేరి వెళ్లి మళ్లీ రాజ్యం చేజిక్కించుకొన్నాడు. తర్వాత పౌరుల అనుమతితో సత్యవంతుణ్ణి యువరాజును చేశాడు. ధర్మం తప్పక రాజ్యం పాలించి కీర్తిమంతు డయ్యాడు.

ఈ విధంగా సావిత్రి తన పాతివ్రత్య ప్రభావంతో తన్నూ, భర్తనూ, అత్త మామలనూ, తల్లిదండ్రులనూ ఉద్ధరించి లోకపూజ్యురాలై ప్రసిద్ధి వహించింది.

---

